# పూజా విధానము

శ్రీ వీరభద్ర పళ్లెం, లేక ఆరాధన చేయుటకు సంకల్పించు వారు మొదలు దంపతీయుక్తముగ మాహేశ్వరుల యధాశక్తి నియమించుకొని, ప్రాతః కాలమందు లేచి, స్నాన సంధ్యాద్యనుష్ఠానములు పూర్తిచేసుకొని, గృహమునకు ఈశాన్య దిగ్భాగమున గాని, తూర్పు ఉత్తరములందు గాని మంటపము నిర్మించి, మంటపమునకు 12 స్థంభములుగాని లేక నాలుగు స్థంభములతో నాలుగువైపుల, మూడు హస్తముల వెడల్పుతో ఐదు హస్తముల ఎత్తుతో నిర్మించి, అలంకారము చేసి, అందు 5 శేర్ల బియ్యము తెల్లని వస్త్రముపైపోసి, (వస్త్రము మూడు గజములుండవలెను.) మూడు మడతలుగాబఱచి పైన బియ్యము, రెండవవరుసలో నవధాన్యములు, మూడవవరుసలో అర్ధశేరు తక్కువ గాకుండా నువ్వులుపోసి ఆపైన సువర్ణ రజితాదికలశం బియ్యంతో నింపిబెట్టి వళ్లెరంలో ఒక ప్రక్క భద్రకాళీ వీరభద్ర ప్రతిమలు సువర్ణ రజితాదులచే మూడు తులములకు తక్కవలేకుండ అధవ యధాశక్తి చేయించవలెను. విభూతివండు కొంతమంది పెట్టుదురు. మంటపంలో గౌరీలతా లింగమండలం లేక వారి ఆచార సాంప్రదాయానుసారం ముగ్గు పెట్టవలెను. మంటపంలేకున్న ఒక గద్దెపీఠమైనా కావలెను. అందు రెండు కత్తులలంకరించి కంకణం కట్టి పెట్టవలెను. మంటపమునకు ఉత్తర దిగ్భాగమున రెండు (కంచుళ్లు) అనగా మూకుళ్లు పెట్టి 4 వత్తులు వేసి, యుంచవలెను.

తొలుత సంకల్పము చేయుటకు పూర్వము దీపారాధన చేసి దంపతులు గణతాంబూలము పట్టవలెను. అనగా పళ్లెరములో విభూదిపండు తాంబూలము. దక్షిణ తీసికొని నిలువబడి ప్రమధ గణముల ధ్యానించి ఆ పళ్లెము దక్షిణ సమీపమందు గల మాహేశ్వరుల కొసంగి అనుజ్ఞాతుండై కూర్చుని ఆచమనము చేయవలెను.

## సంకల్పము

సమశ్శంభవేస్వాహా నమశ్శంక రాయస్వాహా, సమాశ్శాం తాయస్వాహా అని ముమ్మారు ఆచమనం చేసి, శాశ్వత శివస్థాణో, భూతేశ, త్రిపురాంతక, త్రిణయన, శ్రీకంఠ, కాలాంతక, శర్వ, ఉగ్ర, అభవ, భర్గ, భీమ, జగతాంనాథ, అక్షయ, శ్రీవిధే, యీశాన, రుద్రయీశ్వర, మహాదేవాయతుభ్యంసమః అని నామములుచ్చరించి, భూశుద్ధి "ఉత్తిష్ఠంతు, భూత పిశాచాః, ఏతేభూమి భారకాః, ఏతేషాం, మవిరోధేన, బ్రహ్మ కర్మ సమారభేత్. అని అక్షతలు కూర్చున్న చోట వేసుకొని" ప్రాణాయామము చేయవలెను.

ఓం భూః, ఓం బువః, ఓం సువః, ఓం తపః, ఓంగ్ం, సత్యం ఓం తత్సవితుర్వ రేణ్యం, భర్గోదేవస్య ధీమహీ, దీయో యోవ: ప్రచోదయాత్, ఓం మాపోజ్యోతీరసోమృతం బ్రహ్మ భూర్భువస్సు రాపఓం

మమ ఉపాత్త దురితక్షయ ద్వారా శ్రీపరమేశ్వర ముద్దిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శివ, శివ, శంభోరాజ్ఞేయ ప్రవర్తమానస్య

ఆద్యబ్రహ్మణ ద్వితీయ పరార్థే శ్వేత వరాహకల్పే వైవస్వతమ
న్వంతరే కలియుగే ప్రధమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే
మేరోర్ధక్షిణదిగ్భాగే శ్రీశైలస్య ఉత్తర దిగ్భాగే కష్ణా గోదావర్యో:
మధ్యప్రదేశే స్వ/వసతి గృహే సమస్త దేవతా భక్తమాహేశ్వర
గురుచరణ సన్నిధౌ అస్మాకం సహకుటుంబానాం ....... గోత్రస్య.....
నామధేయస్య సకల దురితోపశాంత్యర్థం శ్రీ మత్పరబ్రహ్మణ:
సచ్చిదానంద స్వరూపస్య నిత్య నిర్మల జ్ఞాన ధ్యానార్చనాదిభి:
సర్వేషాం భక్తానాం సాలోక్యాది చతుర్విధ మోక్షప్రదాయకస్య సకల
సురాసుర మునివర సేవితస్య దుష్టహవన శిష్ట పరిపాలన క్రియా
యుక్తస్య మమ శరీరావాహిత ప్రయోగిత ప్రతిష్టంభిత దుష్టగ్రహాది
సర్వవ్యాధి నివారణార్థం ఉచ్చాట నార్థం సర్వశత్రు సంహరణార్థం
ధన కనక వస్తు వాహన చత్ర చామరాందోళికాద్యనేకరూప లక్ష్మీ
ప్రాప్యర్థం అస్మిన్గృహే క్షామ చోర అగ్ని మహామార్యాది సర్వారిష్ట
నిర్మూలనార్థ సర్వసౌభాగ్య సంపత్ప్రదాతవ్యం పుత్ర పౌత్రాభి
వృద్యర్థం ఆయుష్యాభి వృత్యర్థం ఆదిత్యాది సర్వేగ్రహా:
ఏకాదశఫలా వాప్యర్థం శ్రీ భద్రకాళీ సమేత వీరభద్రేశ్వర దేవతా
ముద్దిశ్య శ్రీ భద్రకాళీ సమేత వీరభద్రేశ్వర దేవతా ప్రియత్వార్థం
వీరభద్రారాధనంచ కరిష్యే. ఆదౌ భూభాండ ద్రవ్య స్థలశుద్యర్థం
స్వస్తి పుణ్యాహవాచనంకరిష్యే. ప్రధమేనిర్విఘ్న పరిసమాప్యర్థం
గణాధిపతి పూజాం కరిష్యే-గణాధిపతిపూజా పుణ్యాహవాచనం
కృత్వా ? తదనంతరం కంకణానిధారయేత్, పశ్చాత్. అఖండం
ప్రజ్వాల్య "ఘృతస్యధారా అభిచాకసేమి" అను మంత్రముతో
ఆవు నెయ్యిగాని తెలముగాని బోసి వెలిగించి ఆవాహనాద్యుప
చారములచే బూజింపవలెను.

## మండప పూజా॰

పూర్వద్వారే ఓం శాంతి కళాద్వారాయ నమః పూర్వ వామశాఖయోః ఓం నందినేనమః ఓం మహాకాళాయ నమః మార్తాండాయనమః సోమాయనమః ఇతి పూర్వద్వార దేవతామావాహ్య.

## దక్షిణ ద్వారే

ఓం విద్యాకళా ద్వారాయ నమః. దక్షిణ వామ శాఖ యోః ఓం భృంగినే నమః. ఓం గణపతయే నమః తచ్ఛాఖ మూలే ఓం పర్జన్య ఘటాయ నమః. ఓం నర్మదాయై నమః. ఓం సరస్వత్యైనమః ఇతి దక్షిణద్వారే దేవతామావాహ్య.

## పశ్చిమ ద్వారే

ఓం నివృత్తి కళా ద్వారాయ నమః, పశ్చిమ శాఖ యోః ఓం వృషభాయ నమః. ఓం స్కందాయనమః శాఖ మూలే ఓం భూత సంజీవ ఘటాయ నమః అమృత ఘటాయ నమః ఇతి పశ్చిమ ద్వారే దేవతా మావాహ్య.

## ఉత్తర ద్వారే

ఓం ప్రతిష్ఠాయ నమః ఓం దేవ్యైనమః ఓం చండాయ నమః ఉత్తర వామ శాఖయోః ఓం బంధన ఘటాయ నమః. ఓం ప్రభాసాయ నమః ఓం అంశు మత్యై నమః

(అని ఆవాహనం చేసి విధి ప్రకారం పూజించి ఆపైన అష్టదిక్పాలకులను, నవగ్రహ, దశరుద్రాదుల నావాహనంచేసి పూజించి భద్రకాళీ వీరభద్రులకు ప్రాణప్రతిష్ఠ చేయవలెను.

అస్యశ్రీ భద్రకాళీ సమేత వీరభద్ర దేవతా ప్రాణ ప్రతిష్ఠా మహా మంత్రస్య శరభనాళ్య సద్యోజాత ఋషిః, ఋగ్య యజుస్సామాధర్వాణి, ఛందాసి, పరాశక్తి దేవతా, ప్రాం బీజం, ప్రీం శక్తిః, క్రోంకీలకం, మహాప్రాణ ప్రతిష్ఠాపన శిద్యర్థే, జపేవినియోగః.

## ధ్యానం

శ్లో॥ రుద్రం, రౌద్రావతార.
హుతవహన నయనం, వ్యోమకేశం, సుదంష్ట్రం,
శ్యామాంగం, భీమరూపం,
కిటి, కిటి రభసం, జ్వాల మాలా హుతాంగం,
భూత ప్రేతాధి నాథం, కనక కలుషితే,
ఖడ్గ చర్మే వహంతం, వందే లోకైక వీరం,
త్రిభువన మహితం, వీరభద్రం నమామి.

శ్లో॥ నీలాం, నీలాభ వస్త్రాం, నర రుధికవసాం,
మాంస నిర్భిన్న వక్త్రాం శూలం, కుంతం, రథాంగం,
ఫణిః, ముసల, గదా, తోమరం యాద్యశంచ
శంఖం, ధ్వజ, హల విలసద్వజ్ర, ఖేటం,
కరాబ్జైః బిభ్రాణాం, భీమవేషాం,
విజయతు భువనే, విద్యతే భద్రకాళీ.

మంత్రం : ఓం వీరభద్రాయ, దక్షసంహరణాయ, ఆపదుద్ధరణాయ, ఈశ్వర పుత్రాయ, ప్రళయ కాలాగ్ని రుద్రావతారాయ, నారశింహ సంహరణాయ, ఓం ఫట్ స్వాహా ల, ల, ల, లి, లి, లి, ఓం. అఘోర వీరభద్రాయ నమః, ఓం ఫట్ స్వాహా. (ఆకాశ భైరవ కల్పే) అని ధ్యానించి - వస్త్రం, యజ్ఞోపవీతం, భస్మం, గంధం, అక్షతాదులచే ఆరాధించి, సహస్రనామార్చనచేసి, బిల్వదళములతో పూజించి, నైవేద్యము పూర్తిచేసి, మంత్రపుష్పము పెట్టి. భస్మ ఘుటిక, గుగ్గిలం, అగ్ని వెంటతీసుకొని కత్తిపట్టుకొని, పలువురు ముత్తైదువలు, మాహేశ్వరులతో వీరాంగము వేయుచు గ్రామంలో అవసరమాత్రం తిరుగుచు భద్రకాళీ, వీరభద్ర దేవాలయమున కేగి, స్వామివారి నారాధించి, పూజించిన వెనుక - మంత్రపుష్పంజదివి - అనకట్టుకట్టవలెను.

## ఆనకట్టు (పద్యము)

సీ. శ్రీ వీరభద్ర, యాశ్రిత జనావన ముద్ర,
పాపవిశోష, సద్భక్త పోష
దక్షయాగ విదూర, దానవ సంహార,
కరవాలహస్త, లోక ప్రశస్త,
బ్రహ్మాండ దుర్భల, సింహనాద వినోద,
విఖ్యాత సత్కీర్తి, విమల మూర్తి
బాణ బాణాసన, పరశు గదా చక్ర,
మునల ముద్గర శూల ముఖ్య హస్త.

భక్తితోడుత, మాపు పళ్లెంబు బెట్టెద

బూని యిప్రొద్దు విభూతి విడెము,

గంధ పుష్పాక్షతల్ కడుభక్తి తెస్తిమి,

కృప యుంచి దేవ సరిగ్రహించి.

పళ్లెంబు చెల్లించు పర్యంతమును మీరు,

నిజ నివాసంబున, నిలువ వలయు,

వేట బోవలెనని వేంచేయగా బోకు,

దండు రాణమునకు, తర్లబోకు,

పోయిన మీ తండ్రి కాయజహరు యాన,

మీరిన మీయమ్మగారి యాన,

పరమ విశ్వాస, సద్భక్త, పరులయాన,

గీ. యనుచు సాష్టాంగ దండంబు లమర నిడుదు,

మ్రొక్కు దీరిన ముదమిచ్చు ముదమునొందిఁ

భద్రకాళీ మనోహర, భవదూర వినుత,

శతరౌద్ర, కురవి (కొత్తండ) వీరభద్రా.

అనకట్టు పద్యం చదివిన తరువాత యింటికి చేరి, అస్తమయంకాగానే వీరాంగం, ఖడ్గములు, ప్రభలతో వూరేగుచు నారసములు వేసుకొనుచు వీరభద్రస్వామి సన్నిధానమునకరు దెంచు నపుడు ఖడ్గములు చదువుచు,

## ఖడ్గములు

1

సీ॥ అసురుల వేటాడి-అయోధ్యపురి కేగి
రఘునాయకుల బట్టి రాచివైచి
అర్చుల వెలిగెడి, అగ్ని దేవుని బట్టి
కోరేటి నాలుకల్ గోసివేసి
చెలగి నృశింహాని, చెంపలు వాయించి
సిగబట్టి బ్రహ్మను సిగ్గుబఱచి
గొబ్బున యింద్రుని కోపాన దన్నుతే
అబ్బరోయని కూలె అవని మీద

తే॥ గీ॥ నీదు మహిమంబు వర్ణింప; నెవరి తరము
వర్ణితాకార శంభుని వర కుమార
ప్రళయతల రౌద్ర పరమ కృపాసముద్ర
వినుత శతరౌద్ర కురవి వీరభద్ర.

2

సీ॥ దక్షుడు యజ్ఞంబు దలిపెట్టి నంతనే
బ్రహ్మదేవుని గుండె, భగ్గుమనియె
వింటిరా సురలారా విన్నపంబొక్కటి
కలగంటి యీరాత్రి కల్లగాదు

మహీ మీద పార్వతి మాయమై చనెనని
పరమేశ్వరుని వామభాగమునను
చెమట బుట్టినదాని చెట్రాతిపైనేయ
వీరన్న బుట్టెరా విశ్వమునను
వచ్చెరా వీరన్న గుచ్చెరా చేకత్తి
చొచ్చె రాజనులపై చోద్యముగను

తే॥ గీ॥ అనుచు నింద్రుండు వచియించె నౌరా దేవ
భక్త హృత్సంగ భక్తుల ప్రాణ లింగ
వర్ణితాకార శంభుని వర కుమార
ప్రళయ తలరౌద్ర పరమ కృపాసముద్ర
వినుత శతరౌద్ర కురవి వీరభద్ర.

3

సీ॥ పలక తాటించితే పగిలె భూభాగంబు
కులగిరి పర్వతాల్ క్రుంగె ధరలో
శూల మెక్కించితే సురల గుండెలు పగిలె
నింద్రుడు మూర్ఛల్లి నేలకొరిగె
చక్రంబు త్రిప్పితే క్షితి మీద నౌరగిరి
రక్కసుల్ మిక్కిలి వక్కలుగను
మీసంబు వడివేసి మింటిపై జూచితే
చుక్కలన్నియు రాలె పిక్కటిల్ల

తే॥ గీ॥ ఔర వీరాంగమాడితి వౌర రుద్ర
వర్ణితాకార శంభుని వర కుమార
ప్రళయతల రౌద్ర విశ్వకరుణా సముద్ర
వినుత శతరౌద్ర కురవి వీరభద్ర.

4

సీ॥ పెంపైన విభూతి పేరుగొన్నప్పుడే
నరశింహమూర్తికి నడుము విరిగె
అడపైన శూలంబు నప్పుడు త్రిప్పితే
తెల్లని నామంబు నల్లనాయె
మొలక రుద్రాక్షలు ముఖమున దాల్చితే
తులసి పేరులు తునాతునకలాయె
అప్పుడు వీరన్న అయుధ మందితే
పువ్వుల వానలు భువిని గురిసె

తే॥ గీ॥ ఔర మించితి వీర ప్రపంచముననుఁ
వర్ణితాకార శంభుని వర కుమార
ప్రళయతల రౌద్ర విశ్వకరుణా సముద్ర
వినుత శతరౌద్ర కురది వీరభద్ర.

5

సీ॥ ఛేదించి బ్రహ్మతల చేతను బట్టితో
కోపించి బ్రహ్మాండ కోట్లు చెదర

కాలమృత్యువు బట్టి కండలు చండవో
ఘనమైన మూడు లోకములు బెదర
తలబడి, పారవా, తన్నవాడాకాల
రూపించి చంద్రుని రొమ్ము పగుల
అక్కడి వారిని అదిరించి తోలవా
రంగార మూలకు, రంగములుగ

తే॥ గీ॥ ఔర వీరాంగమాడితి వౌర రుద్ర
వర్ణితాకార శంభుని వరకుమార
ప్రళయతల రౌద్ర విశ్వకరుణా సముద్ర
వినుత శతరౌద్ర కురవి వీరభద్ర.

6

సీ॥ శ్రీ మన్మహాదేవ సృష్టి సంరక్షణా
దక్షా ధ్వరధ్వంసి ధవళవర్ణ
నంది వాహన మీశ నాగేంద్ర కేయూర
కందర్ప సంహార కల్పవృక్ష
కైలాసగిరి వాస కనకాద్రి కోదండ
కారుణ్య నిజభక్త కవి కుమార
గంధర్వ గీర్వాణ గరుడ కిన్నెర యక్ష సిద్ధ
విద్యాధర సేవితాత్మ

తే॥ గీ॥ భద్రకాళీ మనోహర భవ్య చరిత
భగ్నలయ కాలరుద్ర కృపాసముద్ర
వర్ణితాకార శంభుని వరకుమార
ప్రళయతల రౌద్ర విశ్వకరుణా సముద్ర
వినుత శతరౌద్ర కురవి వీరభద్ర.

7

సీ॥ గదా శూల చక్రంబు గండ్ర గొడ్డలి విల్లు
అడిదంబు శూలంబు అంకుశంబు
పిడివెంపు ఝుంఝూళి, బిరుదు సానాకత్తి
బల్లెంబు, శూలంబు వల్లెత్రాడు
కొంగవాలపు కత్తి ఘోర బల్లాణంబు
అంకిణీ సెలకోల అంకుశంబు
గద బిరుసు చేకత్తి గద్దగోరు కరారి
సుర లతాడనముల నృక్కబఱచి

తే॥ గీ॥ మించితివి నీవు వీరప్రపంచమందు
వర్ణితాకార శంభుని వర కుమార
ప్రళయతల రౌద్ర విశ్వ కరుణా సముద్ర
వినుత శతరౌద్ర కురవి వీరభద్ర.

8

సీ॥ కొమరొప్పు బెల్లంబు కొండదేశములోన
పరగణా కోసూరు పట్టణమున
సరవితో; శార్వరి సంవత్సరమున
ఫాల్గుణ మాసాన బహుళమందు
శుభయోగ మష్టమి శుక్రవారమునాడు
నుదయాది మీన ముహూర్తమందు
ఆలోన ముప్పది దినములలోనాడు
ముద్రాల పాపయ్యముదముతోడ

తే॥ గీ॥ భక్తి మెప్పించి భక్తులప్రస్తుతించి
అందెతొడిగించె పాదాన పొందుగాను
ప్రళయతల రౌద్ర విశ్వకరుణా సముద్ర
వినుత శతరౌద్ర కురవి వీరభద్ర.

9

సీ॥ పచ్చని కురువేరు పైనున్న విభూతి
వన్నె వస్త్రముచేత వీరపలక
కుడిచేత నరకంగ పెడిబొబ్బ పెట్టంగ
దక్షయాగంబెల్ల తల్లడిల్లె

దక్షయాగమునకు, దరలుటే చేటని
మూగిరి దేవతల్ మూల మూల
కోటాన కోట్లను వేట్లుపడ కొట్టంగ
వరదలై రక్తంబు వాగుబార
తే॥ గీ॥ మించితివి నీవు వీరప్రపంచమందు
వర్ధితాకార శంభుని వర కుమార
ప్రళయతల రౌద్ర పరమకృపా సముద్ర
వినుతశతరౌద్ర కురవి వీరభద్ర.

వీరాంగము వేయుచు ఊరేగి దేవాలయమునకేగి ఆవాహనా ద్యుపచారములతో భద్రకాళీ వీరభద్రుల నారాధించిన వెనుక ఆనకట్టు విడుపు పద్యం చదువ వలెను.

## ఆనకట్టు విడుపు పద్యం

సీ॥ శ్రీ వీరభద్ర, యాశ్రిత జనావనముద్ర,
భవ్యవైభవ వేష, భక్త పోష,
దక్షయాగ విదూర, దానవ సంహార,
కరవాలహస్త, కర్కశత్రిశూల,
నేటి ప్రొద్దుటివేళ, నీభక్త వర్యులు,
నిన్నాన, కట్టున, నియతి నిలిపి,

పాయసంబులు, కూర గాయలు పచ్చళ్లు,
పప్పు లప్పడములు, పంచదార,
చెలువొంద రుచిగల్లు, శఘణిచారును, మరి
కందమూలాదులు, కందిపప్పు,
అమృతామృత ఫలంబు అరిశెలు గారెలు,
బూరెలు బొబ్బట్లు పుణుకు లమర,
దండి మీరగ మంచిఖండ మండితములు,
చాల కమ్మదనంబు పాలు పెరుగు,
సద్యోఘృతంతోడ సామాగ్రిగా, బూని
పుటికలయందుంచి బూన్కి మీర,
జంగమ లింగాంగు లంగీకృతంబుగా
వీరాంగ వేషులు వేడ్క గూడ,
సంభ్రమంబొలయంగ, శంఖఘుంటాధ్వనుల్,
భేరీ రవంబులు భోరు కొలగ,
యెడనెడ నిల్చుచు, నెడ లేనిదివిటీలు,
వెలుగంగబొగడుచు వినుతియొసగి,
పళ్లెంబు మీకు నర్పణజేసితిమి దేవ, యందలి,
యన్నాదు లనుభవించి,

గీ॥ మించిమాకు ప్రసాదించు, మంచితముగ,
మ్రొక్కులి డెదముభవ పాశమోచ నీకు,
భద్రకాళీ మనోహర, భవవిదూర,
వినుత శతరౌద్ర కురవి వీరభద్రా.

ఆ తరువాత స్వామివారి ప్రసాదం స్వీకరించి యింటికేగి బంధు మిత్రాదులతో ఆరగించవలెను. నిమంత్రిత మాహేశ్వరదంపతుల యథాశక్తి దక్షిణ తాంబూలాదులతో సత్కరించి ఆపోశన వేయవలెను.

సాంప్రదాయముగా అగ్నికుండములు తీయుట కూడా ఆచారము కలదు. దేశ సాంప్రదాయములు భిన్నముగానున్నవి కొందరు పూర్వ రాత్రి అగ్నికుండములు త్రొక్కుదురు, మరి కొందరు వేకువ తెల తెలవారు తుండగా త్రొక్కుదురు, కుండ ప్రమాణం 21 అడ్గులు, వెడల్పు 3 వుండును.

కుండపూజ : బలి హరణ, అష్ట దిగ్బంధన, అగ్ని స్తంభ నాది మంత్రములతో హవిస్సు క్షీరము చల్లుదురు, అగ్నికుండములు త్రొక్కుదురు.

సర్వేజనాసి శుఖినోభవంతు



## 1. వీరభద్ర మంగళహారతి

ప్రశ్న : పసుపు కుంకుమతోడ । నొసట బూదియు మెరయ
పసిడి తల్కులమేల్మి పడతి ! యెక్కడికే ?
ఉత్తరము :విషము మెక్కిమరల । వెసబాపు శితికంఠు
బసగాచు వరవీరభద్రు సన్నిధికే॥మంగళం మంగళం॥
మహానుభావ ॥ మంగళం మంగళం॥
ప్ర : తలకొప్పు ముడివిప్పి ॥ తలతానమున నొప్పి
చలివలువతోనేగు చావ ! యెక్కడికే ?
ఉ : మొలకత్తి బిగియించి । తెలిచాపు ధరియించి
వెలిబూదిదాల్చు వీరన్న సన్నిధికే ॥మంగళం॥
ప్ర : కంకణ మంజీర । కలరవములు మ్రోయ
గాంధర్వ వీణారవకంకి ! యెక్కడికే ?
ఉ : కింకిణిస్వనములు । కైంకర్యములు జేయ
కింక రావతకురవీశు సన్నిధికే ॥మంగళం॥
ప్ర : తాటంక దీధితుల్ । తరణికాంతుల వెల్గ
ధవళాంబరోజ్వల తరుణికి యెక్కడికే ?
ఉ : ఖట్వాంగతోమర । ఖడ్గపాశాంకుశ
కరపద్ముడౌ వీరభద్రు సన్నిధికే ॥మంగళం॥
ప్ర : నిండుపున్నమ చూపు : మెండుగ ధరియించి
చండప్రతాచారోద్దండ ! యెక్కడికే ?
ఉ : భండనఘనశుంభ । చ్ఛండశౌర్యాస్త్రవి
ఖండితారిమండలాండు సన్నిధికే ॥మంగళం॥

ప్ర : కుంభికుంభస్తన । కుంభభారవినమ్ర
కుంభీనసవేణి ! యంబ ! యెక్కడికే ?
ఉ : కుంభసంభవ భక్త । కుంభోదరప్రమథ
జంభారిసుర సేవారంభు సన్నిధికే ॥మంగళం॥
ప్ర : విద్రుమాధరిమౌన । ముద్రదాల్చి ధర
యద్రువ జను శోభవాద్రి ! యెక్కడికే ?
ఉ : భద్రకాళీశ్వరీ । హృద్రమ్య సుఖశయ్యా
నిద్రితకాయుడౌ రుద్ర సన్నిధికే ॥మంగళం॥
ప్ర : నామస్మరణంబున । ప్రేమరోమాంచవై
నీమముతో జను భామ ! యెక్కడికే ?
ఉ : కామహా మేఘాభి । శ్యామ గ్రహానిక
భీమ పాలితలోకస్తోము సన్నిధికే ॥మంగళం॥
ప్ర : ఫల పత్ర పుష్పాంబు । పక్వాన్న రసభర
పాత్ర కేలనుగొను పడతి ! యెక్కడికే ?
ఉ : ఇల కొర్విపట్టణ । నిలయుడై కాళితో
బలుగద్దెపై వెలయు భద్రు సన్నిధికే ॥మంగళం॥
ప్ర : క్షుద్రవాక్కులు మన । శ్చిద్రమని వరవీర
భద్రు నెన్నెడి చిన్ముద్ర ! యెక్కడికే ?
ఉ : భద్రక్షారాక్షాది । ముద్రితతనువీర
భద్ర పోషణ వీరభద్రు సన్నిధికే ॥మంగళం మంగళం॥
మహానుభావ ॥మంగళం మంగళం॥

శివాపార్వతీ ధవామ హేశ భవాశంకరా ॥మంగళం॥
శివేగోత్రసంభవె సుజన బాంధవే శాంభవి ॥మంగళం॥
హరామేరు గిరిధరా కరుణసాగరా పరాత్పరా ॥మంగళం॥
పరేతరాడ్భయ హరేకలుష సంహరే శాంకరీ ॥మంగళం॥
జరామరణ సంహర నీలకంఠ రాజేశ్వరా ॥మంగళం॥
పరానందరూప రాజితే రాజ రాజేశ్వరీ ॥మంగళం॥
జలంధరాసుర బలాపహర శుభ ఫలప్రదాతే ॥మంగళం॥
సలింగ హృదయ స్థలాంచితే బాలలింగ వినుతే ॥మంగళం॥

## 2. మంగళ హారతి

మంగళమిదే శాంభవ । నగజా కుమారా ॥మంగ॥
మంగళారతి దివ్యమాంగళ్య కరచర్య ॥మంగ॥

1. వీరావతారమూని । వీతిహోత్రునిగెల్చి
కాళిగూడిన జగత్కల్యాణ జయవీర ॥మంగ॥
2. మేఘాభి గుణశ్యామ । మేరుమందర ధామ
మౌళిస్థగితసోమ । మంగళాంకితనామ ॥మంగ॥
3. సంజవేళల శక్ర । కంజ భవాదుల
యంజలిలో వద । కంజము గల దేవ ॥మంగ॥
4. తుంబురు నారదుల్ । తంబురమీటగ
సంబరమందెటి । యంబర శుభకేశ ॥మంగ॥
5. వీరభద్రార్పిత । విలసన్ను తిమాలా
విద్యోతగళ ! కురు వీశా ! విగతపాశ ! ॥మంగళమిదేశాంభవ॥

## 3. మంగళహారతులు

లింగా నీకిదె మంగళం యిష్టలింగా నీకిదె మంగళం
ప్రాణలింగా నీకిదె మంగళం భావలింగా నీకిదె ॥మంగళం॥
లింగా కరుణాంతరంగా గేరట్టుంగా
కంధినిషంగా మదిష్ట ॥లింగా॥
సోమా సద్గుణస్తోమా రణరంగభీమా
కైలాసధామా మదిష్ట ॥లింగా॥
ఈశా పరమప్రకాశా కాలవినాశ
సర్వలోకేశా మదిష్ట ॥లింగా॥
రుద్రా కరుణాసముద్రా త్రిభువనభద్రా
వరవీరభద్రా మదిష్ట ॥లింగా॥
భేశా యీమనిపురీశా శ్రీపార్వతీశా
హరయగస్త్యేశా మదిష్ట ॥లింగా॥
దండీగా ముదిగొండ పాపయదాసు



# శ్రీ శివపురాణము-పద్యకావ్యము

రచయిత :

**శ్రీ ముదిగొండ వీరయ్యశాస్త్రిగారు,**

(సుమారు 6000 పద్యములు)

పంచమ ముద్రణము :

రాయల్ 1/8 సైజు - 732 పుటలు

**కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు**

ప్రశంసించిన ఉద్గ్రంథము.

వెల : రూ. **275/-.** పోస్టేజి ప్రత్యేకము

# శైవమత ప్రబోధిని


శ్రీ శైవమహాపీఠము (రిజిష్టర్డు) పక్షమున
ప్రచురింపబడు అధ్యాత్మిక సాంస్కృతిక మాస పత్రిక

విడిప్రతి రు. 6-00

పోషకులు : రు 216-00

రాజపోషకులు : రు. 1116-00

పర్యవేక్షణ : **శ్రీ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు**
(శైవ మహాపీఠాధిపతి)

*ప్రధాన సంపాదకుడు :*
**శ్రీ ముదిగొండ మార్కండేయ**
(రిటైర్డు జిల్లాజడ్జి)

*ప్రకాశకుడు :*
**శ్రీ ములుగు హనుమంతరావు**
1-1-419/ఇ/5/1 గాంధీనగర్,
హైదరాబాదు - 500 080

# అజంతా పబ్లిషింగు హౌస్

అరండల్‌పేట 7వ లైను, గుంటూరు -2.

| | | |
|---|---|---|
| 1. | విక్రమ విజయము | 5-00 |
| 2. | బొబ్బిలి - బెబ్బులి | 5-00 |
| 3. | తిక్కన | 10-00 |
| 4. | రాజరామ మోహనరాయ్ | 5-00 |
| 5. | కదంబము | 5-00 |
| 6. | భక్త హనుమాన్ | 5-00 |
| 7. | భక్త ప్రహ్లాద | 5-00 |
| 8. | ఆంధ్ర ప్రతాపము | 10-00 |
| 9. | అహింసాజ్యోతి | 10-00 |
| 10. | రామరాయలు | 10-00 |
| 11. | విశ్వకవి | 10-00 |
| 12. | శివజ్యోతి | 10-00 |
| 13. | శ్రీ రుద్రగిరి | 10-00 |
| 14. | శ్రీముఖలింగ చరిత్ర | 10-00 |
| 15. | త్యాగము | 10-00 |
| 16. | సుదక్షిణాదేవి | 10-00 |
| 17. | శ్రీనాథ మహాప్రస్థానము | 16-00 |
| 18. | హరచరిత్ర | 60-00 |
| 19. | శ్రీసాయి చరిత్ర | 20-00 |
| 19. | శ్రీ పర్వతపురాణము | 50-00 |

# Dr. I. RAMA KRISHNA

Director Chandra Medical & Health Services,
KAKINADA

Former Principal A.L. Govt. Ayurvedic Medical College,
WARANGAL

Former Superintendent Govt. Ayurvedic Hospital,
Vijayawada

Member of International Society for Health Research
Member of International Society of Asian Systems of Medicine,
NEW YORK

Member of BOS MGR University of Health & Science,
CHENNAI

Member of BOS NTR University of Health & Science,
VIJAYAWADA

Hon. Chairman international Ayurvedic, Katmandu,
(NEPAL)
Hon. Tec Advisor, Dr. Reddy's Lab.
Hon Executive Director Concept Ay. Research Foundation

*Residence :*
Nagamalli, 23-23-60/A, Majetivari St.
S.N. Puram, VIJAYAWADA -11
**Ph : 532484**

# ఓంకార వేదం

## పారమార్థిక మాసపత్రిక


వ్యవస్థాపక సంపాదకులు :

**శ్రీ దేరంగుల శివరాజు**

ముఖ్య సంపాదకులు :

**శ్రీ చందూరి వేంకట సుబ్రహ్మణ్యం**

యం., ఏ., బి.యల్.

(బహుభాషాకోవిద, రామ మానసతిలక్)


| | | |
|---|---|---|
| విడిపత్రిక | : | రు. 10-00 |
| సంవత్సర చందా | : | రు. 120-00 |
| జీవిత చందా | : | రు. 1116-00 |
| పోషకులు | : | రు. 10,116-00 |


**ఓంకార వేదం మాస పత్రిక**

6-2-935/2/2, పావని ప్లాజా ఎదురు రోడ్

రాజ్‌భవన్‌రోడ్, ఖైరతాబాదు, హైదరాబాదు.

# శ్రీమత్ భ్రమరాంబా చెన్నమల్లిఖార్జున స్వామివారి కళ్యాణ మహోత్సవ ఆహ్వానము

## భక్త మహాశయులకు మనవి

స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ చైత్ర శుద్ధ ఏకాదశి పంచాహ్నికముగా ఎలకుర్రులో శివలోకి కాశీనాధుని చినవీరనారాధ్యుల మహోదయులచే 1760 సం॥లో నిర్మించబడిన దేవాలయములో కళ్యాణ మహోత్సవములు జరుపబడును.

స్వామివారి సేవలో

***శివశ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు***

ఈ కార్యక్రమములో "లింగధారణ" ఉచితముగా శివశ్రీ ముదిగొండ మృత్యుంజయ అయ్యవార్లచే జరుపబడును

---

**ఈ ఐదు రోజులు భక్తులకు ఉచిత భోజన వసతి కలదు.**